# సుభాషితరత్నాకరము



ప్రథమభాగము



ఉభయభాషాప్రవీణ

పింజల సుబ్రహ్మణ్యకవి.

# సుభాషితరత్నాకరము

ప్రథమభాగము

( 3, 4 తరగతులకు )

ఉభయభాషాప్రవీణులును, బెజవాడ పుర...

సంఘోన్నత పాఠశాల నాంధ్రోపాధ్యాయులు నగు

## శ్రీ పింజల సుబ్రహ్మణ్య కవిగారిచే

రచింపఁబడినది.



బెజవాడ, ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1935

 [మూల్యము రు. 0-8-0.

# ఆమోదము.



మ॥ మతిమంతుల్ గొనియాడఁగాఁ దగిన వాక్చాతుర్యవిస్ఫూర్తి సం
స్కృతమూలంబును జ్ఞప్తికిం గొలుపుచక్కఁ దెల్గులో ధీసమ
గ్రతవాటిల్లునటుల్ రచించితివి సుబ్రహ్మణ్య! నీ యీ సుభా
షితరత్నాకర మంతరంగమునకుం జేకూర్చె సమ్మోదమున్.

మ॥ స్తుతి కర్హంబగు నీతులుండుట, గుణస్తోమంబు రాజిల్లుటన్
బ్రతిపద్యంబుపమానయుక్తముగ నుండన్ బిన్నలుం బెద్దలున్
సతతంబుం బఠియింప నొప్పు వివిధజ్ఞానప్రదంబౌ సుభా
షితరత్నాకర మెల్లకాలమును వాసిం గాంచెడుం గావుతన్.

కావ్యకలానిధి, శతావధాని
పిశుపాటి చిదంబరశాస్త్రి.



# FOREWORD.

It is with great pleasure that I write this oreword to the Gems of Wisdom in Telugu erse, entitled **'Subhashita Ratnakaram.'** The uthor, **Mr. P. Subrahmanyam**, Ubhayabhasha 'raveena, and Additional Telugu Pandit of our Iigh School, deserves every congratulation. Ie combines, in the work, the experience he as gained as teacher with the Scholarship he ıas acquired through self-culture. Conceived vith forethought and executed in neat and imple style, the books deserve to be placed in he hands of every pupil of the preparatory :lasses (IV and V) of our Secondary Schools ınd of Standards III to V of our Elementary Schools.

The easy flow of verse and the aptness of ıllustration serve to enhance the charm and the ısefulness of the books.

I make no doubt that these will gain immense popularity before long, serving as Text-Books to impart moral as well as secular instruction. I wish the author every success.

Municipal High School,
BEZWADA,
6—12—35.

(Sd.) A. GURUMURTI,
B. A., L. T.,
*Head Master.*

# అభిప్రాయములు.

నేను సుభాషితరత్నాకర ప్రథమ ద్వితీయభాగములను జూచితిని. బెజవాడ మ్యునిసిపల్ హైస్కూలు ఆంధ్రపండితులగు ఉభయభాషాప్రవీణ పింజల సుబ్రహ్మణ్య కవిగారిచే మృదుమధుర శైలితో, స్వాభావికమైన కవిత్వధారతో, సులభమైన తేటతెనుఁగు మాటలతో, పామరులకుగూడ తెలియు నుదాహరణములతో నీతులు బోధింపబడినవి. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులకు, బాలబాలికలకు మిక్కిలి యుపయోగమైన తరగతిపఠనీయగ్రంథముగా నుండగలదు.

Govt. Training School,
BEZWADA.
6—12—1935.

(Sd.) A. RAMABRAHMAM,
B.A., L.T.,
*Head master.*

పింజల సుబ్రహ్మణ్యకవిగారు తాము రచించిన సుభాషితరత్నాకరము ఒకప్రతి నాకు అందజేసిరి. అక్కడక్కడ కొన్ని పద్యములు చదివియుంటిని. వారును స్వయముగా కొన్ని పద్యములను చదివి వినిపించిరి. చాల శ్రావ్యముగా నున్నవనుటలో సందియములేదు. చిన్నిబాలుర కుపయుక్తములగు ననేక విషయములు చక్కగ బోధింపబడినవి. నూతనోపమానములు పెక్కులు గలవు. ప్రాథమికవిద్యాశాలలందును, సెకండరీ స్కూళ్ళలో క్రింది తరగతులకును కడు నుపయోగ మగును.

S.K.P.V.V. Hindu
High School, Bezwada.
9—12—35.

(Sd.) KOTARU RAMA RAO,
M.A., L.T.,
*Head master.*

# సుభాషితరత్నాకరము.



## ప్రథమభాగము.

### సుభాషితము.

ఆ॥ వె॥ బాలుఁడేని యొక సు♦భాషితంబు వచింప
నెల్లజనులు నది గ్రహింపఁదగును
సూర్యకిరణములకుఁ ♦ జొరరాని చోటున
నింతదివ్వె వెలుఁగు ♦ నీయకున్నె ?

ఆ॥ వె॥ విమలమైన వాక్కు ♦ వినువారు లేకున్నఁ
జెప్పువార లేమి ♦ జేయఁగలరు ?
అవని నెల్లరును ది♦గంబరులైన చో
ఫలముగలదె చాకి♦వానివలన ?

ఆ॥ వె॥ అవసరంబునందు ♦ నాడినఁ గొఱగాని
పలుకుఁగూడ నది సు♦భాషిత మగు
అమితబాధఁ గూర్చు ♦ నాఁకలిఁ గొన్నప్డు
గంజియేని ప్రీతి♦కరముగాదె ?

### సుపుత్రుఁడు

ఆ॥ వె॥ గుణగణాఢ్యుఁడైన ♦ తనయుఁ డొక్కఁడు చాలు
నేమి ఫలము నీచు ♦ లెంద ఱున్న ?
చందురుం డొకండె ♦ జగమెల్ల వెలిగించుఁ
జుక్క లెన్ని యున్న ♦ శోభ కలదె ?

ఆ॥ వె॥ పరమధార్మికుండొ ♦ పండితవర్యుఁడో
కాని పుత్రువలనఁ ♦ గలదె ఫలము?
పాడిదైన లేక ♦ చూడిదియైనను
గాని ధేనువునకుఁ ♦ గలదె విలువ?

తే॥ గీ॥ ఖలులు పదిమంది బిడ్డలు ♦ గలుగుకంటె
నొక్కఁడైనను జాలఁడే ♦ యుత్తముండు
పంది తా వంద పిల్లలఁ ♦ బడయుఁగాక
యేనుఁగునకుఁ బుట్టు నొకపిల్ల ♦ కీడు గావు.

తే॥ గీ॥ ఎన్నివిధముల సంపద ♦ లున్న నేమి?
సుతులు లేని గృహంబది ♦ శూన్య మగును
పలురకంబుల పక్షులు ♦ వెలయుఁగాక
హంస లేకున్నఁ జెఱువున ♦ కంద మున్నె?

తే॥ గీ॥ ఎంచఁగా నొక్కనికిఁ బుత్రు ♦ లెంద ఱున్న
నెవ్వఁడో యొక్కఁడే కీర్తి ♦ నెనయఁ గలఁడు
శంఖములు పుట్టె నెన్నియో ♦ సాగరమునఁ
బాంచజన్యంబె హరిమెప్పుఁ ♦ బడయఁగలిగె.

కుపుత్రుఁడు

తే॥ గీ॥ దుష్టుఁ డొక్కండు కులమునం♦దున జనింప
నాకులం బెల్ల నాశన ♦ మందు నిజము
అరయఁగా నొక్కతొఱటలో ♦ నగ్ని యున్నఁ
గాల్పకుండునె గొప్పవృ♦క్షంబు నెల్ల?

తే॥ గీ॥ ఎంచఁగా నీచు లగు పుత్రు • లెంద ఱున్నఁ
దల్లిదండ్రులభారంబు • తఱుగఁబోదు
గాడిదల కెన్నిపిల్లలు • కలిగి యున్నఁ
జాకిమూటలు మోయవే • చచ్చునఱకు ?

శిక్ష

తే॥ గీ॥ గురువరేణ్యులచే శిక్షఁ • గొన్నయట్టి
ప్రజలకే గొప్పతనము సం•ప్రాప్త మగును
సానదీఱిన రత్నాలె • జగతిలోన
రాజుల కిరీటములయందుఁ • దేజరిల్లు.

పండితుఁడు

తే॥ గీ॥ పండితుల పరిశ్రమ మది • పండితులకె
తెలియు మూఢుల కేమియుఁ • దెలియఁబోదు
చేరి శ్రీరంగనీతులఁ • జెప్పఁగాక
బిడ్డ నొప్పు లెఱుంగునే • గొడ్డురాలు.

ఆ॥ వె॥ ఇతరు లెంతమంది•యేని యుందురుగాక
భూషణంబు సభకు • బుధుఁడొకండె
ఎన్నిగ్రహములేని • యెసఁగుచుండునుగాక
రవి యొకండె గగన•రత్న మగును.

తే॥ గీ॥ పండితునిచేత సభ కీర్తి•వడయుఁగాక
యెంద ఱజ్ఞాను లుండిన • నేమి ఫలము ?
హంసచేఁ గొలను బ్రకాశ • మ్మొదుఁగాక
కూడునే శోభ యొకవేయి • కొంగ లున్న ?

తే॥ గీ॥ వసుధపై నెంత గొప్పవి♦ద్వాంసుఁడేని
మూర్ఖమతులందుఁ బూజ్యతఁ ♦ బొందలేఁడు
హంస తా నెంత తెలివిచే ♦ నలరుచున్నఁ
గాకిమూఁకలలో మెప్పుఁ ♦ గాంచఁగలదె?

తే॥ గీ॥ ఎంత పాండిత్యముండిన ♦ నిల స్వదేశ
వాసు లగు వారలకు గౌర♦వంబు సున్న
అరయఁగా మంచిగుణముతోఁ ♦ బరగఁ గాక
పెరటిచె ట్టౌషధం బౌచుఁ ♦ బ్రీతి నిడునె?

ఆ॥ వె॥ పండితోత్తముండు ♦ పరిశీలనజ్ఞాను
లందె గౌరవంబు ♦ నందఁగలఁడు
గొప్పజాతిదైన ♦ గుఱ్ఱంబు రణరంగ
మందె మిగుల కీర్తి ♦ నొందుఁ గాదె?

మూ ర్ఖుఁ డు

తే॥ గీ॥ పండితుం డొక్కఁడేని లే♦కుండుచోట
నల్పమతులేని గౌరవ ♦ మందఁగలరు
అరయఁగా సూర్యుఁ డుదయింప ♦ నంతవఱకు
దీపమేని ప్రశస్తమై ♦ తేజరిల్లు.

ఆ॥ వె॥ అనుభవింపరాని♦యట్టి వస్తువులేని
ముదముతోడఁ గూర్చు ♦ మూర్ఖజనుఁడు
ఎలుక కొంచెమైన ♦ ఫలము లే కున్నను
బసిడిసొమ్ము లెల్లఁ ♦ బట్టి తెచ్చు.

తే॥ గీ॥ అక్షరజ్ఞానమే లేని • యట్టివాఁడు
ఎంతకాలంబు బ్రదికిన • నేమి ఫలము?
పగతురను గాంచి భయపడు • పంద కెంత
బలము గలిగిన నదియు ని • ష్ఫలము గాదె?

తే॥ గీ॥ పశువులను బోలు మూఢుల • బలమువలన
మాన్యుల గుణంబు లన్నియు • మాటుపడును
గాఢముగఁ బర్వునట్టి మే • ఘుంబువలనఁ
దప్పక రవిప్రకాశంబు • కప్పఁబడదె?

తే॥ గీ॥ ఇల మహాపండితుఁడు మర • ణించినంత
నెల్ల పామరులును విజృం • భింపఁగలరు
ఎంచఁగా సూర్యుఁ డొకఁ డస్త • మించినంతఁ
గూయదే మోదమున గ్రుడ్డి • గూఁబగూడ?

తే॥ గీ॥ మూఢుఁ డగువాని ఘనకార్య • మునను నిలుప
సర్వమును క్షణమందె నా • శనముసేయు
రమ్యమైనట్టి రత్నహా • రమును గోఁతి
చేతికిడ ముక్కముక్కలు • సేయకున్నె?

తే॥ గీ॥ చేరి పండితులెల్ల భాషించుచోట
ముదమునం బామరులుఁగూడ • వదరుచుండ్రు
అంచలు కలస్వనంబుఁ గా • వించుచుండ
నచటనే కప్ప బెకబెక • లాడుచుండు.

ఆ॥ వె॥ మూర్ఖులెల్లఁ జేరి ♦ మొఱఁగుచుండెడిచోటఁ
బాసి చనుట మేలు ♦ పండితునకు
కాకులెల్లఁ గర్ణ♦కర్కశంబుగఁ గూయు
స్థలమునందుఁ బికము ♦ నిలువఁ దగునె?

ఆ॥ వె॥ అమితమూర్ఖుఁడైన♦యట్టి మానవునకు
సత్కథాసుధాప్ర♦సంగ మేల?
మిగుల నీచజంతు♦వగు గార్దభమునకు
నింపు నిడునె చంద♦నంపుఁబూత?

ఆ॥ వె॥ మిగుల ద్రవ్యవంతుఁ ♦ డగుఁగాక మూర్ఖుండు
గౌరవం బొకింతఁ ♦ గాంచలేఁడు
గుడ్డివానిచెంత ♦ గొప్పయాభరణంబు
లెన్నియుండుఁగాక ♦ యేమి ఫలము?

ఆ॥ వె॥ పండితుండు గర్వ♦పడఁబోఁడు సుంతైన
పామరుండు మిగులఁ ♦ బదరుచుండు
నిండుకుండ తొణక♦నేరదు రవ్వంత
వట్టికుండ యెపుడు ♦ మిట్టిపడును.

ఆ॥ వె॥ స్వల్పదానంబుచే బుధుల్ ♦ సంతసింతురు
గాని మూర్ఖులహృదయంబు ♦ కరఁగఁబోదు
జలముఁ బోసినయంత వృ♦క్షములు పోలెఁ
పుడమిపై రాళ్లు నభివృద్ధిఁ ♦ బొందఁగలవె?

## సజ్జనుఁడు

తే॥ గీ॥ సజ్జనులు దాము గష్టముల్ • సైఁచుచుండి
కోరి పరులకు సుఖముఁ జే•కూర్చుచుందురు
మహిని వృక్షంబు లెండలో • మాడుచుండి
యితరులకుఁ జల్ల నగు నీడ • నిచ్చుఁగాదె !

తే॥ గీ॥ సాధుజను లెల్లకాలంబు • సరసఁ జేరి
కష్టములఁ దీర్చి దీనులఁ • గాఁచుచుందురు
కంటి కినుమంతయును బాధ • గలుగకుండ
నెల్లవేళల ఱెప్ప ర•క్షించుఁగాదె !

తే॥ గీ॥ సాధుపుంగవు లగు వారి•స్వాంతమందు
దుర్జనుల దూషణంబులు • దూరఁబోవు
ఱాలతోఁ గొట్టిననుగూడ • బాలకులకు
మధురఫలము లొసంగదే • మావిచెట్టు !

తే॥ గీ॥ దూషణంబుల వినియును • భూషణములఁ
బల్కుచుండుట సాధుస్వ•భావ మగును
సంద్రమున నుప్పునీర్ద్రావి • జలధరంబు
ధరణిపైఁ దీయనిజలంబుఁ • గురియుఁగాదె !

తే॥ గీ॥ శత్రువులకైన మేలునే • సలుపుచుంట
సాధుజనుల స్వభావ మీ•జగతియందు
చెఱకు నమలుచుఁ బిప్పిగాఁ • జేయునట్టి
జనుల కీయదె మధురర•సంబు నెపుడు ?

తే॥ గీ॥ సర్వకామితములుగూడ ♦ సాధుజనులు
అడుగకయె పూర్తిఁ జేయుదు ♦ రర్థితతికి
సూర్యచంద్రులు దా మెల్ల ♦ చోటులందుఁ
గోరకయ కాంతి నెపుడుఁ జే ♦ కూర్చుచుంద్రు.

తే॥ గీ॥ ఇలనుఁ సజ్జనుఁ డొక్కండు ♦ గలిగి యున్న
నింక నమృతంబుకొఱకు వాం ♦ ఛింప నేల?
దాత యొక్కండు తనచెంతఁ ♦ దనరుచున్న
కల్పవృక్షంబు కోసమై ♦ కాంక్ష యేల?

తే॥ గీ॥ స్వల్ప మగు పూజవలననే ♦ సాధుజనులు
సంతసము నొందుచుందురు ♦ సంతతంబు
అమ్మహేశ్వరునకుఁ జిన్ని ♦ తుమ్మెపూవు
హరికిఁ దులసీదళంబుఁ బ్రి ♦ యంబుగాదె!

తే॥ గీ॥ సత్పురుషు లెట్టికార్యంబు ♦ సలుప నున్న
భావమున మాత్రమే యుండు ♦ బయటఁ బడదు
కమలములయందు సూర్యుండు ♦ గాంతి నిడుట
నెవనికైనను ముందు వి ♦ న్పించు నొక్కొ!

తే॥ గీ॥ సజ్జనుల కష్టములనెల్ల ♦ సమయఁ జేయ
సజ్జనులె చాలియుందు రీ ♦ జగతియందు
ఏన్గు పంకంబులోఁ జొచ్చు ♦ నెడల దాని
నేన్గులేగాక యొరు లుద్ధ ♦ రింపఁ గలరె?

తే॥ గీ॥ అరసి చూడంగ సజ్జను • లైనవారి
నెంచి సజ్జనులే గౌర•వించుచుంద్రు
చంద్రుని శిరంబున ధరించు • శంకరుండు
చేరి రాహువు కబళింపఁ • గోరుచుండు.

తే॥ గీ॥ సజ్జనుల గొప్పతనము నీ•జగతియందు
సజ్జనులె చాటుచుందురు • సంతతంబు
పూలలోని సువాసన • గాలివలన
నెల్లదిక్కులయందు వ్యా•పించుఁగాదె?

తే॥ గీ॥ ఎట్టియాపదలేని ప్రా•ప్తించుఁగాక
సజ్జనుల దివ్యభావంబు • సడలఁబోదు
అగ్నిహోత్రునిచే బాధ • యమరుఁగాక
వీడునే కప్పురపుఁదావి • వీసమైన?

తే॥ గీ॥ ఆపదలయందె సజ్జను • లైనవారి
దివ్యమగు శక్తియంతయుఁ దేటపడును
అగ్నిలోఁ బడి తపియించు • నపుడె మున్ను
లేనివాసన యగురునం • గానవచ్చు.

తే॥ గీ॥ దుర్జనులతోడ స్నేహంబు • దొడరినంత
సహజసౌమ్యంబు వీడరు • సాధుజనులు
కాకితోఁ జెల్మి యెంతేని • గలిగియున్నఁ
గోకిల త్యజించునే మంజు•కూజితంబు?

తే॥ గీ॥ ఎప్పుడు దుష్టులలోఁ బ్రవే • శించుఁగాక
సజ్జనుని సాధుభావంబు • సడలఁబోదు
అనయమును యమునానదిఁ • మునుఁగుఁగాక
తెల నగు హంస యిసుమంత • నల్లఁబడునె?

తే॥ గీ॥ అరయఁగా సజ్జనుల స్థిర • మైన మనసు
దుర్జనులచే రవంతయుఁ • దొట్రువడదు
విమలమై యొప్పు రత్నదీ • పముల కాంతి
యడఁగునే గాలిచే నిసు • మంతయైన?

తే॥ గీ॥ కోప మొక్కింత సుజనులఁ • గూడుఁగాక
చెఱుపఁగా లేదు వారల • చిత్తవృత్తి
తలఁపఁగ నపార మగు సము • ద్రంపునీరు
ఎప్పుడే నింకునే గడ్డి • నిప్పువలన?

తే॥ గీ॥ అరయఁగా నొక్క మధుర వా • క్యంబువలన
సజ్జనుల కోపమంతయు • సమసిపోవు
చల్లనౌ నీటి నొక్కింతఁ • జల్లినంతఁ
బాయకుండునె క్షణములోఁ • బాలపొంగు?

ఆ॥ వె॥ కొండెగాండ్రు చెప్పు • కుటిలవాక్యములచేఁ
జెడదు సాధుజనుల • చిత్త మెపుడు
సర్పములవిషంపు • సంపర్క మున్నంతఁ
గొలనినీరు చెడునె • కొంచెమైన?

ఆ॥ వె॥ సజ్జనునకు నెంత ♦ సంపద గలిగిన
గర్వ మెప్పుడేని ♦ గాంచఁబోఁడు
సర్వరత్నములకు ♦ స్థానమైనను సము
ద్రమున కించుకయు మ♦దంబు గలదె?

ఆ॥ వె॥ సాధుజనులు దమకు ♦ సంపద ల్గలిగెడు
కొలఁది వినయమూని ♦ మెలఁగుచుంద్రు
ఇల ఫలించినట్టి ♦ వృక్షంబులన్నియు
నొప్పుమీఱ వ్రాలి ♦ యుండకున్నె?

ఆ॥ వె॥ చెడ్డచెలిమివలనఁ ♦ జేరదు దోషంబు
సుంతయేని బుద్ధి♦మంతునందు
చందనంపుఁదరువు ♦ సర్పనివాసమై
యైన విషము దాని♦యందుఁ గలదె?

ఆ॥ వె॥ జగతియందు సాధు♦జను లయాచితముగా
నొరుల కెపుడుఁ జేయు♦చుంద్రు మేలు
తలఁచిచూడ మేఘ♦ములు దమంతటఁ దాము
బ్రజలతాపమెల్లఁ ♦ బాపుచుండు.

ఆ॥ వె॥ శుద్ధచరితుఁ డైన♦చోఁ బరస్పరశత్రు
లిరువు రతని గార♦వించుచుంద్రు
అంగజునకు నిష్టుఁ ♦ డైనట్టి చంద్రునే
శివుఁడు శిరమునందుఁ ♦ జేర్చికొనఁడె?

## దుర్జనుఁడు

తే॥ గీ॥ సజ్జనులలోన నొక్కఁడు దు♦ర్జనుఁడు చేరి
నంతమాత్రాన సజ్జనుం ♦ డగునె వాఁడు?
తెలిసి తెలియక మణులలోఁ ♦ గలిపినంత
గాజుపెంకు రత్నం బౌచుఁ ♦ గాంతిఁ గనునె?

తే॥ గీ॥ ఎన్నియో యత్నములను గా♦వించియేని
మంచివానిగ దుష్టుని ♦ మార్పలేరు
ఎంతయును బున్గుతోడ మ♦ర్దింతురేగాక
యుల్లిగడ్డ సువాసన ♦ నొందఁగలదె?

తే॥ గీ॥ ఎంచఁగా మహాత్ముల నెది♦రించు దుష్టు
లెల్లఁ దమదోషముననె న♦శింపఁగలరు
అగ్నిపై మోహరించిన ♦ యందువలన
మంటలోఁ బడి మిడుతలు ♦ మ్రగ్గకున్నె!

ఆ॥ వె॥ నీతివాక్కు లెన్ని ♦ నేర్పిన దుష్టుండు
మంచితన మొకింతఁ ♦ గాంచఁబోఁడు
ఎన్నిగతుల శ్రమల♦నేని సహించియుఁ
జక్కఁజేయఁగలరె ♦ కుక్కతోఁక.

ఆ॥ వె॥ జనుఁ డొకండు దుష్టుఁ ♦ డని విన్నమాత్రాన
నెల్ల రతని గంట♦గించుచుంద్రు
అరయఁ గంటఁబడిన♦యంతఁ దేలును జంపఁ
దలఁచుచుంట నైజ♦ధర్మమొకద!

## ఉపకారము

తే॥ గీ॥ పరులప్రాణంబు రక్షింపఁ • బాటుపడెడు
వాఁడు కరుణామయుండని • వాసికెక్క
పావురంబును బ్రతికింపఁ • బ్రతినఁబూని
మేనిమాంసంబు శిబి యిచ్చె • శ్యేనమునకు.

తే॥ గీ॥ ఇలను బండితు లెందఱు • గలిగియున్నఁ
బరులమేలు గోరెడువార • లరుదుసూవె
తీయనై రోగము నశింపఁ • జేయునట్టి
యౌషధం బది దుర్లభ • మగును గాదె!

తే॥ గీ॥ ఎట్టిసంకటమేని బ్రాప్తించుఁగాక
మానరు పరోపకారంబు • మాన్యజనులు
పదములకు బంధనంబు సం•ప్రాప్తమైనఁ
బాలొసంగవె యావులు • బ్రజలకెల్ల?

తే॥ గీ॥ అరయఁగఁ బరోపకారి యై•నట్టివాఁడు
తనదు లాభం బొకింతయుఁ • దలఁపఁబోఁడు
చంద్రుఁ డిలకెల్లఁ గాంతి నొ•సంగుఁగాక
తనకళంకంబుఁ దీర్చుకోఁ • దలఁచు నొక్కొ!

తే॥ గీ॥ అమితమైన కష్టంబుఁ దా • ననుభవించి
పరులకు సుఖంబు గల్గింతు • భవ్యమతులు
చెఱకుకట్టులు యంత్రానఁ • జిక్కి నలిగి
మధురరసము నొసంగవే • మానవులకు?

తే॥ గీ॥ ఉర్విపై నెందఱెందఱో ♦ యుందు రేగాక
పరహితుం డొక్కఁడే కీర్తిఁ ♦ బడయఁగలఁడు
వేలకొలఁదిగ సర్పముల్ ♦ వెలయుఁగాక
భూమిని భరించు శేషుఁడే ♦ పొందు యశము.

ఆ॥ వె॥ సంకటములఁ బొందు ♦ సమయమందును సాధు
జనులు పరహితంబు ♦ సలుపుచుందు రే
అరయ రాహువక్త్ర♦మం దుండి సూర్యుండు
కమలములకుఁ దా వి♦కాస మిడఁడె?

ఆ॥ వె॥ అధమమైన చోటు♦నందుఁ బుట్టియు సాధు
జనులు లోకహితము ♦ సలుపుచుందు
తలఁచిచూడ నౌష♦ధులు కానలోఁ బుట్టి
యెల్లరోగముల హ♦రింప కున్నె?

## అపకారము

ఆ॥ వె॥ పరులఁ జెఱుప నెవఁడు ♦ భావమందుఁ దలంచు
నట్టివాఁడు చెడును ♦ దుష్టతుదకు
శైశవమునఁ గృష్ణుఁ ♦ జంపఁ బూతన వచ్చి
యతనివలన మరణ ♦ మందలేదె?

ఆ॥ వె॥ అహిత మాచరించు ♦ నట్టివాఁ డనవార
లైనఁ బరమశత్రు ♦ లగుట నిజము
తనదు దేహమందు ♦ జనియించిననుగూడ
వ్యాధి తనకు శత్రు ♦ వగును గాదె?

## అదృష్టము

ఆ॥ వె॥ ఎల్లరకు నదృష్ట♦మే ఫలియించును
గాదు పౌరుషంబు ♦ గాదు విద్య
రాయి దేవుఁ డగుచు ♦ రాజిల్లు నం దేమి
విద్య పౌరుషంబు ♦ వెలయుచుండె?

ఆ॥ వె॥ దైవబల మొకింత ♦ తన కున్న దుర్బలుం
డేని శత్రువుల జ♦యింపఁగలఁడు
ఎంచఁగా శరీర♦మే లేని మన్మథుం
డెల్లలోకముల జ♦యించుఁగాదె?

తే॥ గీ॥ యుక్తు లెన్నేనియును నేర్చి ♦ యుండుఁగాక
భాగ్య మది లేక సంపదల్ ♦ వడయు టరుదు
మిగుల జిత్తులమారియై ♦ నెగడుఁగాక
నక్కకు లభించునే మృగ♦నాథపదము.

తే॥ గీ॥ అరయఁగా రూపహీనుండె ♦ యగునుగాక
భాగ్య ముండిన సంపదల్ ♦ వడయఁగలఁడు
కర్ణములు జూడ మిగుల వ♦క్రంబు లయ్యుఁ
బొందవే రత్నమయ హేమ♦భూషణముల?

## దురదృష్టము

ఆ॥ వె॥ గొప్పమేలు మదిని ♦ గోరంగ దురదృష్ట
గరిమవలనఁ గీఁడు ♦ కలుగుచుండు
ఆశతోడ రాహు ♦ వమృతంబునకుఁ బోవఁ
జక్రధరునివలనఁ ♦ జావుమూడె?

ఆ॥ వె॥ అందఱకును మిత్రుఁ ◆ డగువాఁడె దురదృష్ట
వంతునకు సతంబు ◆ వైరి యగును
ఉర్వికెల్ల గాంతి ◆ నొసఁగెడు సూర్యుండె
కుముదములకు హానిఁ ◆ గూర్చుఁగాదె?

ఆ॥ వె॥ ఎంతగొప్పవారి◆కేనియు దౌర్భాగ్య
వశతఁ గష్టగతులు ◆ వచ్చుచుండు
అల మహేశు శిరము◆నందు భూషణమయ్యుఁ
జందమామ క్షయము ◆ నొందవలసె.

ఆ॥ వె॥ ఎట్టిఘనుల నాశ్రి◆యించిన భాగ్యాను
సారముగ ఫలంబు ◆ సంభవించు
శివునికంఠమందుఁ ◆ జేరియు వాసుకి
గాలిఁ బీల్చి బ్రదుకు ◆ గడుపవలసె.

ఆ॥ వె॥ అధికశక్తివంతు ◆ లైనను దౌర్భాగ్య
మనుభవింపవలయు ◆ నది నిజంబు
పరమపురుషు లైన ◆ హరి సముద్రంబులోఁ
బవ్వళింపవలసెఁ ◆ బాముమీఁద.

ఆ॥ వె॥ ఇల నదృష్టహీను ◆ లెంత పావను లైనఁ
దలఁపఁ జెడుఫలంబె ◆ కలుగుచుండు
అమితనిర్మలంబు ◆ లైనను నేత్రంబు
లెపుడుఁ గాటుకనె ధ◆రింపవలసె.

తే॥ గీ॥ ఇలను నిర్భాగ్యునకు ధనం • బిడినకోలఁది.
యతనిచేటునకే హేతు • వగుట నిజము
ఎప్పుడును వాన మిగుల వ•ర్షించుకోలఁది
వాడిపోవునుగాదె జి•ల్లేడుమొక్క !

తే॥ గీ॥ భవ్యగుణ ముండుఁగాక దౌ•ర్భాగ్యునందు
సరసుఁడు తలంపఁ డాతని•సరసఁ జేర
మంచివాసనతో విజృం•భించుఁ గాక
చంపకముచెంత కేగునే • షట్పదంబు?

ఆ॥ వె॥ ఇల నదృష్టహీను • లెంత కష్టించిన
ఫలము స్వల్ప మగుచుఁ • బరగుచుండు
కడుఁ దపించి యేడ్చి • కన్నీటిమాత్రము
జలముఁ బొందఁగలదె • చాతకంబు?

ఆ॥ వె॥ ధాతవ్రాఁత సుంత • దాటి వర్తింపంగ
శక్తికలదె యెట్టి•జాణకైన?
అఖిలలోకనేత్రు•లై వెల్గు నాసూర్య
చంద్రు లెప్పుడు నస్త•మొందవలసె.

ఆ॥ వె॥ అరయ విధివిధాన • మనునది నరులకే
గాదు సురలకేని • కలిగియుండు
అలఁ గుబేరుతోడఁ • జెలిమిగల్గినఁగూడఁ
జర్మముల ధరించు • శంకరుండు.

# సుభాషితరత్నాకరము.

## గుణము

ఆ॥ వె॥ ఎంత ద్రవ్యవంతుఁ ♦ డేనియు సద్గుణం
బెనయకున్న గొప్ప♦తనము సున్న
కాంచనంబు నిండు♦గా నున్న మేరువు
పర్వతాధిరాజ♦పదముఁ గనునె ?

తే॥ గీ॥ ఎంత ధన ముండినను గుణ♦హీనుఁడైన
వానిఁ జేరరు సజ్జను ♦ లైనవారు
వెండికొండయు బంగారు♦కొండ యుండ
జందనపుఁజెట్టు మలయాద్రి♦సరసఁ జేరె.

తే॥ గీ॥ అధికసౌందర్యవంతుఁడే ♦ యగునుగాక
గుణము లేకున్న గౌరవం ♦ బెనయఁబోఁడు
తావి లేనట్టి మోదుగ♦పూవునందు
నెంతచక్కదనం బున్న ♦ నేమి ఫలము ?

తే॥ గీ॥ గుణములే యెల్లెడలఁ బూజఁ ♦ గొనునుగాని
తండ్రి యన వంశ మన నిర♦ర్థకము సుమ్ము
వాసుదేవున కొనరింతురు ♦ వందనములు
తండ్రియైనట్టి వసుదేవుఁ ♦ దలఁతురొక్కొ ?

ఆ॥ వె॥ బహుగుణాఢ్యునందుఁ ♦ బరికింప నొకదోష
ముండుఁగాక తలఁప ♦ రొక్కరేని
చందమామలోని ♦ కందు భావింతురే
గుణము లందె ప్రీతిఁ ♦ గొందురుగాక !

తే॥ గీ॥ గుణమునకు గౌరవంబు చే♦కూరుఁగాని
యున్నతాసనమునఁ జేరి♦యున్న రాదు
కోటకొమ్మలపై నెక్కి ♦ కూరుచున్న
మాత్రమునఁ గాకియును గరు♦త్మంతుఁ డగునె?

తే॥ గీ॥ వసుగుణమును దెలియని♦వారు దాని
నపహసించుటలో నేమి ♦ యబ్బురంబు
వాసిగల ముత్యములఁ గాలఁ ♦ ద్రోసి బోయ
వెలఁది ధరియింపదే గురి♦వెందగింజ?

తే॥ గీ॥ గుణముగలవాఁడె గుణముఁ జే♦కొనఁగఁజాలు
నిర్గుణుం డేమియు గ్రహింప ♦ నేరకుండు
కోయిల వసంతగుణముఁ గ♦న్గొనును గాక
కాకి రవ్వంతయు నెఱుంగఁ ♦ గలుగునొక్కొ!

తే॥ గీ॥ గుణముగలవాఁడుగూడ స♦జ్జనులచేతఁ
జెప్పఁబడకున్న నుంతయు ♦ మెప్పుఁగనఁడు
సూర్యకిరణంబు లిసుమంత ♦ సోఁకకున్నఁ
గాంతిసేకూరునే సూర్య♦కాంతమణికి!

తే॥ గీ॥ ఒకగుణం బున్న నదియ వే♦ఱొకగుణంబుఁ
గోరుచుండును విఖ్యాతిఁ ♦ గొనఁ దలంచి
సహజముగ రమ్యమై యొప్పు ♦ చక్కఁదనము
తరుణభావంబుచే మనో♦హరముగాదె?

## దోషము

ఆ॥ వె॥ పుడమి జన్మతోడఁ • బుట్టిన దోషంబు
తొలఁగ దే యుపాయ•ములనుగూడ
మంచితేనెలోన • ముంచి యుండినఁగూడ
వేపచెక్క చేదు • విరుగు నొక్కొ!

తే॥ గీ॥ ఎంచి గుణదోషముల నిశ్చ•యింపకుండ
నేపనియుఁ దీవ్రముగ నాచ•రింపరాదు
బలమదంబున నెవఁడేని • పామునోటఁ
జేయిఁబెట్టిన యెడల న•శింప కున్నె?

## భాషణము

తే॥ గీ॥ సభలయందుఁ బ్రసంగంబు • సలుపకున్నఁ
బండితునకును గౌరవ • ముండఁబోదు
కోకిలంబేని గొంతెత్తి • కూయకున్నఁ
బ్రజల మెప్పును సుంతైనఁ • బడయఁగలదె?

ఆ॥ వె॥ సర్వశాస్త్రములను • జదువునుగాక నో
ర్విప్పకున్నఁ గీర్తి • వెలయఁబోదు
గట నెంత మంచి • కంచుతోఁ జేసిన
ఘనతఁ గనునె నాల్క • గలుగ కున్న?

ఆ॥ వె॥ అతిమనోహరంబు • లగు మాట లాడిన
ఘనులుగూడ మిగుల • గౌరవింత్రు
చిలుకపలుకు మంచి • పలుకుల నాలించి
యవనిపతులు ముద్దు•లాడ రొక్కొ!

